# చెన్నకేశవశతకము



రచయిత, శతావధాని

కీ॥ శే॥ రాపడుగు సీతారామశాస్త్రిగారు

# చెన్నకేశవ శతకము

రచయిత, శతావధాని

శ్రీ॥ శ్రీ॥ రామడుగు సీతారామశాస్త్రిగారు

సంపాదకుడు, పుత్రుడు,

సత్యనారాయణశాస్త్రి.

ఉదారులు, నల్లమోతు కృష్ణయ్యగారి

ద్రవ్యసహాయమున ముద్రితము

మధురభారతి, స్వయంవ్యక్త, కావ్యకలానిధి

## మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రిగారు

పదుగుం బేకగ సంస్కృతమ్ము తెనుఁగుం బాటించి లోభక్తిలో
తడుపుంబెట్టిన యట్టులన్ శతకవస్త్రం బల్లియున్నావు రా
మదుగా! మేల్కావనంబు పేరిటి నెరామగ్గంబునన్ జాలధ
న్యుఁడ వర్పించితి చెన్నకేశవున కింతున్ నిన్నుఁ బుణ్యాత్మకన్

దద్దాయని వచ్చి మీఁదబడు చందంబొక్కచో చూపు నీ
పద్దెంబే యికనొక్కచో మొగమె చూపంబోక భీష్మించు మా
యొద్దన్ నీవిపుడున్న నిక్కముగ నీయుద్దండతన్ మెచ్చి నీ
సుద్దిన్ సుద్దిగలట్టి మర్మమెరుఁగన్ శుశ్రూష గావింపమే.

అణువున్ సంశయమందకే యడుగుటే యాలశ్యమైపోవ ము
ద్రణకైనట్టి వ్యయంబు సర్వమిడగన్ తాసిద్ధమైనట్టి స
ద్గుణునిన్ శ్రీయుతు నల్లమోతు కులపాథోరాసి జైవాతృకున్
గణనంజేతును కృష్ణయాభిధుని నెక్కాలంబు ధన్యాత్మకన్.

# పోషక వంశావళి

దుష్టమార్గాలకుం దొడగువారల గుండె
వగులు వాఱఁగ మండిపడెడువారు
జారవృత్తులలోన సంతసం పడునట్టి
పాపులపయి మండిపడెడువారు
చౌర్యమ్ములలో నేర్పు చాలగా గడియించు
వారి నడఁప మండిపడెడువారు
వర్ణాశ్రమాచార వర్తనమ్ములవీడు
చెడుగులపయి మండిపడెడువారు

'మండిపడ' గోత్రమందు జన్మమ్మునంది
సార్థకముచేసి నల్లమోతన్నవాయ
మును బవిత్ర మొనర్చిన మోతుబరులు
ధన్యతములు కృష్ణయవంశజన్య లిలను.

భూజనస్తుత్యమై పొలుపు గాంచినయట్టి
"నల్లమోత"న్వయం బుల్లసిల్లు
తాత "శ్రీస్వామి"యుఁ దండ్రి "రంగయ్య"గా
వెల్గిన "కృష్ణయ్య" విశ్రుతుండు
తల్లి "సుబ్బమాంబ" తన కండ్ల వెల్గుగాఁ
బెంచినయట్టి పవిత్రతముఁడు

"స్వామికోటమ్మ"దా పామేనుగా నుండ
ఘనత నందినయట్టి కనుసుశీలుఁ
డన్న "పానయ్య"యు నక్కలు "రత్నమ్మ"
"సౌభాగ్య"మాంబ వత్సలతఁ బెనుప

నాత్మ పుత్రీమతల్లులౌ నా "సుశీల"
యును "సరోజమ్మ" "సుగుణ"యునొప్పి తనకు
కీర్తి కడలంటఁ జేయఁగాఁ గేవలమ్ము
దానకర్ణుఁడుగా భూమిఁ దనరెఁ గాదె!

భూతలమందు నెందఱు ప్రభూతధనమ్ముల మించి లేరు? వా
రేతఱి నిట్టి సద్గుణమహీయసులై ఘనకావ్యచింతనా
త్యాతతసక్తమై కవిత లాదృతిమై ప్రకటించినారు? వి
ఖ్యాతయశుండు "కృష్ణయ"కుఁ గల్గెనుగాక తదీయభాగ్యము

బ్రహ్మవిజ్ఞాన మాఱసి ప్రతిభ మిగుల
దాన ధర్మాదిగుణములఁ దనరినట్టి
కృష్ణయను చెన్న కేశవుం డేలుఁగాత
నాయురారోగ్య భాగ్యము లందఁజేసి.

సంపాదకులు.

శ్రీమించు సర్వ ధాత్రీచక్రమందు భరతఖండం బన వరలుచుండు
రమణీయ కృష్ణాతరంగిణీ తీరంబు విద్యానిధుల కెల్ల హృద్యసీమ
అందునఁ గొండవీడను పట్టణంబొప్పు రుక్మిణీముఖ్యుల రూఢి గాంచి
యద్దాని దగ్గఱ నతిరమ్యమై యొప్పు శివకేశవాది సద్భవనములును

ఏపురం బెల్ల పురముల గోపురంబు
ఏపురము పూతజనులకుఁ గాపురంబు
ఏపురము సంపదల కెల్ల దాపురంబు
ఆ పురవరంబు నాదెండ్ల యను పురంబు.

మున్ను మార్కండేయ మునివరుం డఖిల తీర్థమ్ముల సేవించి నెమ్మిమీఱ
కాశికాపురిఁ జూచు కౌతుకమ్మున నేగి యందుండి కొన్నాళ్లు హర్ష మొఁ
భగవత్కృపాలబ్ధిఁ బడసె శిలామయంబయిన కేశవ విగ్రహంబు నొకడు
ఆ విగ్రహంబును నతిశయభక్తి చేఁ బూజించుచుండి యీ భూతలంబు

నెల్లఁ జరియించి చిత్తమ్ము పల్లవింపఁ
దన పదమునకుఁ జేరుచో దారి నున్న
నురుచిరంబగు నాదెండ్లపురముఁ జేర
నపరగిరి శిఖరముఁ జేరె నబ్జహితుఁడు.

అంతట గాల్యముల్ సలిపి యమ్మునికుంజరుఁ డొక్కగట్టు న
త్యంత సమీపమందుఁ గని యందులకుం జని విగ్రహంబు బల్
సంతసమొప్పు రాతిపయిఁ జయ్యనఁ బెట్టి తదంతికంబునన్
గొంత శ్రమంబుఁ దీర్చికొని కోర్కె మెయిన్ శయనించె నంతలోన్

తోవలకు నెచ్చెలి లేజ
క్రొవగవలకుగొంగవేళ్ళు కబళము రేవె
ల్గు వినుసిగతలరతనమట
దివినిం జెలువారె నమృత దీధితు లెసఁగన్ .

అంత ముదంబు మీఱఁగ మహర్షి యియాసతలేచి విగ్రహం
బెంతయు లేవనెత్తి నను నిట్టటుఁబట్టి కదల్చినం గటా!
సుంత చలింపఁదయ్యెఁ గడుఁజోద్య మెలర్పఁగ దివ్యదృష్టిచే
నంత యెఱింగి యా హరికి నాలయమందు సృజించె నత్తఱిన్

సురుచిర మండపంబులను సుందర మందిర గోపురంబులన్
గర మనురాగమొప్పఁ గరకంబుగ గట్టుపయిన్ రచించి శ్రీ
హరి పరమావతారమగు నట్టిదు కేశవ విగ్రహంబుః మే
దురతర భక్తి నిల్పి పరితోషితవృత్తిని గొల్చుచుండఁగన్ .

చనుము నీయాశ్రమమునకు సంయమీంద్ర!
వలసినప్పుడు నను మదిఁ దలఁచికొనుము
నీకుఁ బ్రత్యక్షమగుదు నస్తోకలీల
ననుడు స్వాశ్రమమున కేగ మునివరుండు .

శ్రీపతి యంతమీఁదట విచిత్ర మెలర్పఁగ గట్టుపైని దాఁ
గోపము నూనుమాడ్కి మునికుంజరు పుణ్యపుకుప్ప యొక్కనాఁ
డా పురవీథిమధ్య నుదయన్మిహిరాంశుని మండలంబు నా
దీపితవిగ్రహప్రభలు దిక్కులఁ బర్వఁగ నిల్చె నయ్యెడన్

అటఁ దురుష్కులు రాజులై యలరుకతన
నర్చకులు దేవదేవు రహస్యభూమి
దాఁచి దేశైకవర్తులై తారు వెడలఁ
గొంత కాలమ్మునకు జనుల్ సంతసిలఁగ

అధికులగువారి స్వప్నంబులందుఁ బొడమి
యాలయముఁ గట్టుఁడని పల్క నక్కజముగ
నప్పు డలరెడు పుణ్యాత్ము లధిక భక్తి
నట్టు లొనరించి దేవేశునందు నిలుప.

శ్రీనీలాభూరమణుల
తో ననవరతంబు వెల్గు తోయజనాభుం
డీ నాదెండ్ల పురంబున
మానుగ వసియించె నఖిల మానవు లెన్నన్.

ఏతాదృశ్మహా మహిమప్రభావ విరాజితుండగు శ్రీ చెన్నకేశవస్వామిని గుఱించి నా రచియించిన శతకం బైహికాముష్మిక సుఖప్రదంబై తనరుగాత.

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# చెన్నకేశవ శతకము

శ్రీరమణీ మనః కుముద శీతమయూఖ! విరించిముఖ్య బృం
దారక వారచారుతర నవ్యకిరీటమణీ ఘృణీఝరీ
పూర విరాజమాన పదపుష్కరజాత! నమోఽస్తుతే లస
న్నీరదనీలగాత్ర! ధరణీభరణక్షమ! చెన్నకేశవా!

భూతలమందు సద్విబుధపుంగవు లబ్బుర మందగన్ భవా
న్యాతత సత్కృపాకలన నష్టవధాన శతావధానముల్
ఖ్యాతి మెయిన్ రచించి యొక గ్రంథ మొసంగని తప్పుగాచి
ద్యోతనకోటి తేజ! శతకోత్పలముల్ గొను చెన్నకేశవా!

అరసి తావనకీననుమహామహిమన్ వినుతింపఁబూన నే
నారద సంయమీంద్రుడనో? నాకుభవుండనో? భారతీమనో
హారినో? రాజతాచలవిహారుడనో? భవదీయ పాదదా
సేరుడ మూఢభక్తి నుతిసేయఁ గడంగితి చెన్నకేశవా!

తప్పులు కల్గనీక వినతాసుతవాహన! మన్ముఖంబునన్
జెప్పుము పద్యరత్నములఁ జిత్రపదంబులఁగూర్చి కైత నేఁ
జెప్పెదనంచు గర్వమునఁ జెప్పఁదలంచిన వాఁడఁగాను మా
యప్ప భవద్దయాకలితమైన ప్రయత్నమె చెన్నకేశవా!

మండితనీలగాత్ర! మునిమానసశంబర! జాతమిత్రదో
ర్దండ! హతారిగోత్ర! సితతామరసాభవిశాలనేత్ర! మా
ర్తాండ! సుతాకళత్ర! విబుధస్తుత పుణ్యాచరిత్ర! దుష్కృతా
ఖండ లతాలవిత్ర! గుణకాండపవిత్రక! చెన్నకేశవా!

కొందరు శంకరుం డనుచుఁ గొందరు పద్మజు డంచు నొక్కటన్
గొందరు మాధవుం డనుచుఁ గొందరు గోపకుఁడంచు నే మహా
నందమయున్ దలంచెదరో నామది నవ్యయు నయ్యానంతుని
న్నందరిలో వెలుంగు పరమాత్మగ నెంచెద చెన్నకేశవా!

ఏ మహానీయు పాదరజమిచ్ఛల ధాతృ కురంగపాణి సు
త్రామముఖామృతాశులు నిరంతర తత్పరచిత్తులై శిరః
స్తోమములందుఁ దాల్చి పరితోషితమానసులౌదు రట్టి సు
శ్రీమహితా! భవచ్చరణసేవ నొసంగుము చెన్నకేశవా!

సూరసహస్రధామ! ఘనసూరిజనస్తుతనామ! భానుజా
తీరమనోజ్ఞధామ! బలధిక్కృతభార్గవరామ! సంగత
శ్రీరమణీమణీహృదయసీమ! మునీంద్రమనోభిరామ! స
ర్వారి సమూహభీమ! దరహాసితసోమ్య,సు చెన్నకేశవా!

శీతమయూఖతుండ,యతసీ కుసుమద్యుతిదేహదండ! ని
ర్ధూతనతాఘకాండ,పరితోషిత తాపసకాండ! శత్రుసం
ఘాతతమిస్రచండకరకల్పిత సర్వపయోజజాండ! ని
త్యాతతదానశౌండ! సమదాసురఖండన! చెన్నకేశవా!

జిష్ణుముఖామృతాశనుల జేయ భుజావిజయప్రభావరో
చిష్ణుల రావణాది సురజేతల చేఁతల విన్నవింపఁగా
నుష్ణ మరీచివంశ కలశోదధి పూర్ణసుధాకరుండవై
విష్ణుపరావతార నృపవీరుడవై తగు చెన్న కేశవా!

పుత్రులఁగోరి పఙ్క్తిరథ భూతలనాథుఁడు వేఁడ సదయా
పౌత్రునిగా నొనర్చి యనపత్యతఁ బాపఁదలంచి తత్సతీ
క్షేత్రమునన్ జనించి నృప శేఖరు వంతలమాన్పినట్టి నిన్
స్తోత్రము సేతు భూమితలధూర్వహ! సర్వగ! చెన్న కేశవా!

కోటి నిశాటధాటి ముఖకోటరబాలకరోటకోటి ను
గ్రాటవిఁ దాటకాభిధ నిశాటినిఁ గీటడగించినట్టి యో
హాటకచేల! నీదు సుగుణాళి నుతింపఁగఁ బూనుకొన్న నా
బోటికిఁగాదు పద్మభవుబోటికిఁ గాదట చెన్న కేశవా!

నీచకృతిప్రవీణుని వనేచరసాధు మునిప్రకాండ హిం
సాచరణప్రసక్తుని నరాశనవర్యు మహాచలాభు మా
రీచునిఁ బీఁచమాఱఁగ సరిత్పతిలోఁ బడవైచి చెచ్చెరన్
నీచు సుబాహుఁజంపి ముని నిర్మలుఁ జేసిన చెన్న కేశవా!

కౌశికసంయమీంద్రు వెనుకన్ మిథిలాపురికేగి యందు ధా
త్రీశశతమ్ము లెందరో ధరింపఁగలేని మహేశు చాపమున్
గౌశలమొప్ప వామకరకంజమునన్ వెసనెత్తి, తున్మి, భూ
మీశుల మెప్పుఁగాంచిన మహారమణీప్రియ! చెన్న కేశవా!

మానవనాయకోత్తముల మర్త్యునిగాఁ దలఁపన్ విదేహ భూ
జాని ముముక్షుధీమున్న మునిసత్తముఁ డాత్మధృతిన్ వహింపఁగన్
మానవతీమణిన్ జనకనందిని సుందరపద్మలోచనన్
బాణిగ్రహించునట్టి రఘువంశవిభూషణ చెన్న కేశవా!

వారవిలాసినుల్ నటనవైఖరిఁ జూపఁగఁ బుణ్యభామినుల్
సౌరసతీమతల్లికలు సారెకు హారతు లిచ్చుచుండఁగన్
బాలుల దీవనల్ పటహభాంకృతి నిస్వనముల్ దిగంతముల్
భోరుకలంగ వేడ్కఁగరభోరు గ్రహించిన చెన్న కేశవా!

నీతివిహీనయై ఘటజనిష్ఠురశాపహతిన్ మహావనిన్
రాతిగ నున్నయట్టి మునిభామ నహల్యను గాంచి సద్దయన్
బూతభవత్పదాంబుజము మోపి సతీమణిఁగా నొనర్చు వి
ఖ్యాతచరిత్రు నిన్నుఁ గొనియాడఁగ శక్యమె? చెన్న కేశవా!

రాముడ నేనుగా కెవడురా యిలఁ జూడగ నీమ మెప్పు ను
ద్దామపరశ్వధాప్తి బహుధా సమయించి ధరామరేంద్రులన్
నామముమాన్పు రాముఁడను నామ మెఱుంగవొ నామహత్త్వమున్
రామతలాగి వేడుక సరాముఁడవై తగు చెన్న కేశవా!

ఘోరవనీస్థలంబునకు గొబ్బునఁ బంపుము రాము నాసుతున్
ధారుణి రాజ్యభారమునఁ దప్పక నిల్పుము నాగఁ గైకకున్
గోరికఁ దీర్చి తండ్రిపలుకుల్ సఫలంబులు జేసినట్టి స
ద్ధీరజనార్చితా నిను మదిన్ దలపోసెద చెన్న కేశవా!

దర్పక సంగరంబునకుఁ దార్కొనుమంచు వచించు పాపినిన్
శూర్పణఖాఖ్యఁ జంపకయ ముక్కుగ వీనులు ముక్కఁగోసి యా
దర్పమునార్చి పంపుమని తమ్మునిచే నొనరింపఁజేసి సం
తర్పితమానివైన వరదా! ఖరదైత్యహా! చెన్న కేశవా!

దుష్ట ఖరాసురాదులను దోర్బలశక్తిని సాజిఁద్రుంచి సం
తుష్టి మహామునీశులకుఁ దూర్ణముగాఁ బొసఁగించి యెల్లెడన్
శిష్టులఁ బ్రోచుచున్ సుజనశిక్షయొనర్చెడి దేవ, మన్మనో
భీష్టము లెల్లఁ దీర్పుము గభీరగుణాకర! చెన్న కేశవా!

అంగముఁబన్ని మంజులతరాంగముఁదాల్చి కురంగలోచనా
సంగతి రంగుమీర్చిను వెసంగని మానసముం గరంచుచున్
జెంగట బంగరుం బొడల శృంగములం గడురంగుమీఱు సా
రంగమునం గనంగను ధరన్ బడఁగూల్చిన చెన్న కేశవా.

అంతరమందు సీతకయి యంతకు నంతకుఁ జింతనొంది యొ
క్కింత యుదంతమారసి యహీనశకుంతముఁ గాంచి వింతగా
నంతట నంత్యకర్మముల నవ్విహగేంద్రున కాచరించు భూ
కాంత! భవచ్చరిత్రము లఖండములారయ చెన్న కేశవా!

ఓహటిలంగ లోకముల నుక్కడగించుచుఁ బెక్కురీతులన్
సాహసకృత్యముల్ సలిపి సంగరమందు నజేయుఁడై మహా
బాహుసహాయుఁడై నెగడు పర్వతసన్నిభుడౌ కబంధునిన్
బాహుల నొక్కవ్రేటునకు భంగమొనర్చిన చెన్న కేశవా!

హైళిభయంబుఁ బాపి యమరాళి నుతింపఁగ సప్తతాళముల్
లీలగఁ దున్మి యందలి వలీముఖపాళులుకొల్వ మత్తఖం
డాలసహస్రతేజుని రణప్రభవిష్ణుమహేంద్రసన్నిభున్
వాలిని నేలఁగూల్చిన యవార్యచరిత్రక! చెన్నకేశవా!

మార్గ మొసంగుమన్న ఖలమార్గమునంబడి యీయకున్నచో
దుర్గమవారిరాశిఁగని దోర్బలమేర్పడఁ జాపమూని బల్
మార్గణముల్ విడన్ గలఁగి మార్గమొసంగిన మెచ్చి జానకీ
మార్గణ తత్పరుండవగు మాన్యగుణాలయ! చెన్నకేశవా!

వాయుజభాను జాతనలవానర ముఖ్యులు సందడింప న
త్యాయత వార్ధిసేతువు నయంబునఁ గట్టఁగఁ జేసి దైత్య సం
స్థాయము డాసి చిత్తమున ధైర్య మెలర్పఁగ ఘోరదానవా
మ్నాయముఁద్రుంతు నన్న యసమానపరాక్రమ చెన్నకేశవా!

నమ్మితి నీ పదమ్మును మనమ్ముననిన్ శరణమ్ము వేడితిన్
దమ్ముఁడ నీదువైరికిఁ బదమ్ము ధనమ్మఖిలమ్ము వీడితిన్
నమ్ము నిజమ్ము నాదు వచనమ్మన నెమ్మి విభీషణున్ వెసన్
సమ్మతిఁగాచి రమ్మని భృశమ్ము సుఖమ్మిడు చెన్నకేశవా!

ఇచ్చెద లంకరాజ్యము వధించెద రావణునాజిఁ గానిచో
నిచ్చెద నా యయోధ్యనని హెచ్చగు కూరిమిఁబల్కి శక్తిచే
నచ్చెరువంద నెల్లరు వియచ్చరులుబ్బఁగఁ బఙ్క్తికంఠు వే
నిచ్చజయించి భక్తునకు నిచ్చితి రాజ్యము చెన్నకేశవా!

కాకము సీతకొక్క యపకార మొకానొక వేళ సేయ న
స్తోక శరాశనంబునను దూర్ణత నొక్క శరంబుఁగూర్చి నీ
వేకడ కేగినన్ దునుము నీకఠినాస్త్రము నాగభీతి మై
నీకు నమస్కరింపఁ గరుణింపవె దానిని చెన్నకేశవా!

నాదురితంబుఁ బాపు కఠినంబుల నాడిన కైకతప్పులన్
నీదుమనంబులోపల గణింపక యేలు మయోధ్యనన్న వే
వే దయసేయుమింక మన వీటికి నా భరతున్ దయామతిన్
బాదుకలిచ్చి పంపిన విభాకర వంశజ చెన్నకేశవా!

భావజ బాణనిర్మథిత భావుడు! శ్రీ విభవోన్మదుండు! సీ
తా వనితా ప్రభావము యథావిధిఁ గానక తా హరింప దై
త్యావళితోడఁ గేవల రణావని శేవనుజూపి లోక వి
ద్రావణు రావణున్ శగపరంపర దున్మిన చెన్నకేశవా!

దక్షిణ పక్షిరీతి బలదక్షుఁడు లక్ష్మణుఁ డన్వనక్షితిన్
లక్ష మహోక్ష తుల్యుల నలక్ష్యుల లక్షల రాక్షసాళిఁ బ్ర
త్యక్షముగా వధింప లయదక్షగతిన్ శరలక్షుఁ జొన్పుచున్
రాక్షస శిక్షఁజేసిన రణక్షమదక్షప! చెన్నకేశవా!

మానవతీమణిన్ సుజన మాన్యగుణన్ జనకాత్మజాత తో
మానుగఁబుష్పకాభిధ విమానము నెక్కి యనూన హర్షతన్
భానుజవాయునూను ముఖవానర కోటులతో నయోధ్యకున్
మానితవృత్తి నేగిన యమర్త్య పతిస్తుత చెన్నకేశవా!

ఆడఁగ మేనకాది దివిజాంగన లెంతయు సంతసంబునన్
వేడఁగ దేవతాళివిను వీధిని కిన్నర యక్షనాయకుల్
బాడఁగ బాడబాళి బహుబంగుల స్వస్తివచింప సీతతోఁ
గూడి యయోధ్య నేలు రఘుకుంజర మ్రొక్కెద చెన్నకేశవా!

ఏ మహనీయుఁ డాస్యమున నీశ్వరకాంచన గర్భ ముఖ్య సు
త్రామధనంజయాంబుపతి దండధరాధ్యమ రాళిఁదద్భట
స్తోమము దత్సతీసుతులతో రఘు వేషుకఁజూపెఁ దల్లికిన్
శ్రీ మహనీయునట్టి యదుశేఖరు వేడెద చెన్నకేశవా!

ఏ వనజాయతేక్షణు సహాసముఖాంబురుహంబునందు వే
రావణ ముఖ్య దిక్కరివరింబుల వింధ్యహిమాద్రి భర్మ భూ
ధ్రావలి నాకముఖ్యనగరావళిఁ గాంచె యశోదయట్టి ల
క్ష్మీవర నీకు మ్రొక్కెద శేశయాలోచన చెన్నకేశవా!

నారదముఖ్యసన్మునిగణంబులు పాండవ ముఖ్యబంధులన్
సూరుల యోగధారుల విశుద్ధమనస్కుల పారిజాత మం
దార మహీజ మానస కనత్సరసున్ గరుడాది వీనులే
శూరుడు చూపె మోమున యశోదకు నట్టిడ చెన్నకేశవా!

ఏ యదురత్న మాస్యమున నీసచరాచర మైన విశ్వమున్
వాయుజలాగ్ని భూమిసువర్త్మల సర్వగ భూతకోటులన్
బాయని గోపికామణుల బంధుల మిత్రులనందముఖ్యులన్
శ్రీ యుతుఁడౌచుఁజూపె నల చిన్మయరూపక చెన్నకేశవా!

ఏరుచిరాంగుఁడీ సరిదధీశుల శైలములన్ సరిత్తులన్
ధారుణి మానవాళిని రథంబుల నేన్గుల వారువంబులన్
బావుల రాజకోటులను బాదపకోటులఁ బట్టణంబులన్
ధీరతఁజూపెఁ దల్లికల ధీరజనార్చిత చెన్నకేశవా!

ఏనవనీతహారి రజనీశ్వరభాళి వియత్తలంబునన్
భానుమునీశ సప్తక సుపర్వగురూశన ఉర్వరాజ తా
రేనజ ముఖ్యులై తగు గ్రహేశ్వరులన్ ధ్రువునిన్ యశోదక
జ్ఞానసమందుఁ గన్పరచె నట్టిడు దేవర చెన్నకేశవా!

వ్యాళపరీవృఢాది ఫణివర్గముకోల్వ సహస్రకస్ఫటా
పాళి మణీఘృణుల్ దెసలఁబర్వఁగ సర్వవసుంధరన్ మహా
కోలముతాల్చుభంగి నవికుంఠితశక్తి భరించుభూరి పా
తాళము నాస్యపద్మమునఁ దల్లికిఁజూపిన చెన్నకేశవా!

రంగదభంగ మంగళతరంగ ఘుమం ఘుమ ఘుంఘుమార్భటీ
సంగత పావనోదక విసర్పదభంగ ఝరీపరంపరో
త్తుంగ నినాదసంకలిత ధూర్జటి పారిషదన్ శుభాంగ స్వ
ర్గంగ నెవండు మాపెను ముఖంబున నట్టిడ చెన్నకేశవా!

బాలకహంత్రి పూతన ప్రభావ మెలర్పఁగఁ గంసుపంపునన్
బాలిడవచ్చి చన్నుఁగుడువన్ దళపంగ నెఱింగి వేడ్క డా
కేలను నొక్కచన్నుగుడి కేల నొక్కటిఁబట్టి దాని ప్రా
ణాలహరించినాడవట నందతనూభవ చెన్నకేశవా!

ఆసురమాయలం బవిచినట్టి బకాసుర ధేనుకాసురుల్
త్రాసకరాంగులై మెలఁగఁ దద్గురుగర్వమడంచి వారి వి
తాసులఁజేసి గోపకుల పార్శ్వ పయోనిధిఁ దేల్చినట్టి వృ
త్రాసుర వైరి సోదర దయాసలితాం పతి చన్న కేశవా !

బాలుఁడవై తృణాసురునిఁ బ్రాణముఁదీసి శిశుత్వమేర్పడన్
డోల వసించి భూరిశకటున్ బరమార్చి మహోన్నతంబులౌ
సాలములన్ రసాస్థలి వెసన్ బడఁద్రోసిన నీవిచిత్ర పుం
గ్రీడల నెన్న నావశమె కృష్ణమురాంతక చెన్నకేశవా !

కాళియనామ పన్నగము కండు మహాహ్రదమందు బాడ బ
జ్వాలలఁబోలెఁ దీర వనపాళులనెల్లను గాల్చుచుండి యా
భీలవిషానలార్చు నతి వేల భయంకరవృత్తినుండఁగన్
బాలుఁడవై తదుజ్జ్వల ఫణాతలిన్వచ్చిన చెన్నకేశవా !

ఓ వరమేశ యాదవకులోత్తమ తానములాడునత్తఱిన్
మాపటముల్ హరింపఁదగు నా నగరే మగవారలంచు నా
గోపికలెల్ల వేటమడుగున్ విడివచ్చిన నిత్తునంచు వే
నీపకుజంబు నెక్కు ఘనునిన్ నినుగొల్చెద చెన్నకేశవా !

ఏడుశరత్తు లర్భకున కీడి సుమంతయుఁ జాలదీ మహా
శైలముఁ గేల నెత్తివనిస్వాంతశులన్ భయమందుచున్న గో
పాలురఁగాంచి నిర్భయత బంధువులార వసింపుఁడన్న గో
పాలశిరోవతంస! నినుఁ బ్రస్తుతిఁజేసెద చెన్నకేశవా !

శారద రాత్రులన్ గమలజాతముఖుల్ భవదీయ వేణు గీ
తారవతోషితాత్మలయి దర్పక మోహనబాణ భిన్న హృ
త్సారసలై గృహాదుల వెసన్ విడి నీకడకేగుదేరగా
నారతినాధుకేళి సుమహాంబుధిముంచిన చెన్నకేశవా !

సారసగంధియోర్తు సుమసాయకకేళిఁ బెనంగి డస్సి ని
ద్రారతచిత్తయౌట మకరధ్వజగేహము పైని ధాని పెన్
జీరయొకింత జారఁగని చెచ్చెరనందున వెన్నవెట్టి మా
ర్జారముఁజీరి తాళముఁ గరంబున వైచిన చెన్నకేశవా !

బాళిమెయిన్ బ్రియుంగలసి పంచశరాహవతత్పరాత్మతన్
బాలయొకర్తు కూడునెడఁ బైనొక తేలును వైచి తేలు తేల్
తేలని బిట్టుగాఁబలికి తెంపరివై కరయుగ్మకంబుచేఁ
దాళము వైచు నీదుచరితంబులు వింతలు చెన్నకేశవా !

అంగనయోర్తు తక్రము సమంచిత లీలగఁ ద్రచ్చి యంత పై
వంగఁగ వెన్నఁదీయఁగ జవంబునఁ బైఁబడి తన్మృగేక్షణో
త్తుంగ పయోధరంబులను దోష మెలర్పఁగఁ బట్టి వేగ న
య్యంగజ కేళిఁదేల్చి చనునట్టి విటోత్తమ చెన్నకేశవా !

మత్తమరాళయాన యొకమానిని తక్రఘటంబు నెత్తి పై
నెత్తుక వీధిఁబోవునెడ నిచ్చతలిర్పఁగఁ గుచ్చి కౌగిటన్
జిత్తజకేళిఁగూడ నలచేడియ భీతిలి కృష్ణకృష్ణ! మా
యత్తయసాధ్యయన్న నభయంబిడికూడిన చెన్నకేశవా !

అంబుజనేత్ర యొక్కతె గృహాంతరమందు జలంబులాడ వే
డ్కం బరుగెత్తి కుడ్యముం దటాలున దూకి త్వదంతికంబు నం
దుం బడె నాదు కందుకము తోయజగంధి ! యొసంగుమంచు హ
స్తంబులం దత్కుచంబుల ముదంబునం బట్టిన చెన్నకేశవా !

నాతియొకర్తు వాకిట జనంగమకించిన నిన్నుం బట్టగాం
జేతమునం దలంచి తనచేతుల నడ్డమువెట్టి నిల్వగా
నాతరుణీమణిం గని భయం బిసుమంతయు లేక దానివా
వాతెఱ గంటువెట్టి చను వారిజలోచన చెన్నకేశవా !

నీ కౌమరుండసాధ్యుండు వనేరుహలోచన! యోయశోద! దే
వీ! కనుగొమ్ము నాదుసుత వీధిసరాసరిం బోవుచుండంగాం
బైకొని వాతెఱంగొఱికి పంప నహోయన భీతిం జూపుచున్
నీకడనుంటినంచు జననిం గని మ్రొక్కిన చెన్నకేశవా !

ఏటికి హద్దులేనిపను లిట్లొనరింపంగం గృష్ణ! యన్న మా
గోటికిం గట్టివేతునని గోసము మైజనయిత్రి కట్ట ను
త్పాటనశక్తి కల్గి పసిబాలుని భంగి నటించు నీకతల్
బూటకముల్ గదా భువనమోహనరూపక చెన్నకేశవా !

గేహమునందు నొంటరిగం గీరసరస్వతియోర్తు తన్నును
త్సాహ మెలర్ప నద్దమున సారెకుం జూడంగ వెన్కం జేరి పెన్
బాహులం గౌగలించి ముఖ పంకజ మద్దమునందుం జూపి సం
దేహము లేక కేళిజలధిన్ మునిగించిన చెన్నకేశవా !

వల్లభుఁ డూరికేగు నెడ వచ్చును గృష్ణుఁడటంచు భీతిచే
వల్లవి యొక్క రాతిరిఁ గవాటము మూసి పరుండి నిద్రబో
నల్లన నేగుదెంచి మదనాహవరంగమునన్ మెలంగు ప
ప్పల్లవపాణి బిట్టలవఁ బాతి హసించిన చెన్నకేశవా !

సూనుఁడొకండు లేమి నొకసుందరి డెందమునందుఁ గుంది సం
తానవిహీన జన్మము వృథావిత నాదని వంతయేల ప
ద్మానన ! కంతుకేళిని రయంబునఁ గూడుము నన్ను నీకు సం
తానము కల్గఁ జూడుమని దానిఁ బెనంగిన చెన్నకేశవా !

వారిసముజ్జ్వలాంగు, సితవారిజలోచను, రత్నహార కే
యూర కిరీటినిన్ గని మహోత్సుకతన్ వినుతించి యట్టులే
తీరమునన్ నినుంగని మదిం బరమాద్భుతమందునట్టి య
క్రూరునిఁ బ్రోచునట్టి యదుకుంజర మ్రొక్కెద చెన్నకేశవా !

హింసకు శంకనొందక యహీనమదంబునఁ బుట్టు పాపలన్
ధ్వంసమొనర్చి నీజనని బాములఁ బెట్టిన పాపకర్మునిన్
గంసునిఁ దున్మి యాపితల కష్టముఁ దీర్చిన యాదవాన్వయో
త్తంసు రిరంసుఁ గొల్చెదఁ బృథాసుతసారధి చెన్నకేశవా !

వచ్చెఁ బ్రియుండు నాకడకు వచ్చెను నాకడకంచు ముందుగా
నచ్చపలాక్షులెల్ల హృదయంబుల మోదము జెందుచుండఁగా
నచ్చెరువంద నందఱకు నన్నివిధంబుల నీస్వరూపమున్
జెచ్చెరఁ జూపినట్టి మునిశేఖర సన్నుత చెన్నకేశవా !

వారి విహార సక్తమతి వారిజనేత్రలు రెండుప్రక్కలన్
గూరిమినిల్చి కొల్వఁ గుచగుచ్ఛములన్ భుజవల్లు లుంచుచున్
నేలుపుమీఱఁ జక్రగతి నించి చెలంగిన రాసలీల నె
వ్వారు నుతింపఁగాఁగల రవార్యచరిత్రక చెన్న కేశవా!

దర్ప మెలర్పఁగా నరకదైత్యుఁడొనర్చెడి బాధకోర్వ కా
ప్వర్పతిముఖ్యనిర్జరులు చయ్యన నిన్ శరణంబు వేఁడఁగా
సర్పముఁజీల్చు తార్క్ష్యగతి సత్వర మొప్పఁగ వానిఁ ద్రుంచు కం
దర్ప విరోధిసన్నుత పదద్వయ మ్రొక్కెద చెన్న కేశవా!

చందన లేపనంబుల వెసంగొని వచ్చి యొసంగు కుబ్జ వే
డ్కం దనరూపహీనతఁ దొలంగఁగఁజేసి దయార్ద్రదృష్టి న
చ్చందన గంధినిన్ గుసుమసాయక కేళినిఁదేల్చు దేవకీ
నందన కుందకుల్య రదనా యదుశేఖర చెన్న కేశవా!

తల్లులఁ దండ్రులన్ సుతులఁ దమ్ముల నన్నల నత్తమామలన్
వల్లభులన్ ధనంబులను వాసములన్ విడి శంబరద్విష
ద్భల్లవిభిన్న చిత్తలయి వల్లభతన్ గనుమన్న వల్లవీ
పల్లవ పాణులన్ సురత వారిధిముంచిన చెన్న కేశవా!

మాగధసాల్వచైద్యముఖ మానవనాయకు లడ్డగింప ను
ద్వేగతశక్తిఁ దన్నృపులవేఁచి సురాధిపుఁ గొల్చి మున్ సుధన్
లాగిన పక్షినాయకుని లాగున భీమతనూజఁ దెచ్చు భ
ర్మాగ సమానధైర్య కరుణాకర మ్రొక్కెద చెన్న కేశవా!

గొల్లఁడు రాచకన్నియ నకుంఠితుఁడై కొనిపోయెనంచు బల్
ప్రల్లదుఁడైన రుక్మి పరిపంథితఁబూనగ రుక్మిణీమనం
బెల నెఱింగి వానిని వధింపక న్యక్కృతుఁ జేసినట్టి స
త్తల్లజ నీ చరిత్రము నెదం దలపోసెద చెన్నకేశవా!

దుర్భర విప్రబాణహతి దూనశరీరుఁడు బాలుఁ డుత్తరా
గర్భగుఁడార్తిఁ జెందఁగ నఖండ సముజ్వల వైష్ణవాస్త్రమున్
నిర్భయవృత్తిఁ బూని యల నీరజలోచన గర్భ గోళమం
దర్భకుఁ గాచునిన్నహరహంబు నుతించెద చెన్నకేశవా!

పాపభయంబులేక కచభారము గైకొని యీడ్చి తెచ్చి యీ
పాళు మెఱుంగనట్టి ననుబట్టి పటంబులడుల్చగ జడుల్
హా! పరమేశ! భక్తవరదా! యదునందన! ప్రోవుమన్న న
య్యాపదఁ బాపి కృష్ణ! మరియాదను నిల్పిన చెన్నకేశవా!

ధర్మసుతాధ్వరమ్మున బుధ ప్రకరమ్ములమోల నల్ల దు
ష్కర్ముఁడు చేదినాథుఁడు వెసన్ గఠినోక్తులనాడ దేవతా
శర్మద తచ్ఛిరంబును సుదర్శన సంహతిఁ దున్మినట్టి నీ
నిర్మల కీర్తి లోకములనిండి వెలింగెను చెన్నకేశవా!

పూజ్యుల బంధు సోదరులఁ బోర గతాసులఁ జేసి కుంభినీ
రాజ్యరమాలలామను చిరంబు వహించుట కన్న నీయెడన్
బూజ్యమనశ్వరంపు తనువుం దెగఁజూచుట నాఁగిరీటికిన్
ద్యాజ్యమహంతయుంచుఁ బరతత్వముఁ దెల్పిన చెన్నకేశవా!

పుత్రుని పేరునం బురుష పుంగవుఁడొక్కఁడు నిన్ స్మరింపఁగాఁ
జిత్రముగాఁగ నాతనిని శ్రీకర తావక భూరి సత్కృపా
పాత్రునిఁగా నొనర్చి భవపద్ధతిఁ బాపితి దేవ నీదు చా
రిత్రము స్తోత్రపాత్రము హరీ హరిరాట్ప్రియ చెన్నకేశవా!

అల్గిన సత్యభామకయి యయ్యమరేశ్వర నందనావనిన్
వెల్గెడి పారిజాతమును వీఁక సమూలముగాఁగఁ దెచ్చి యా
వల్గువిలోచనం గలసి వాంఛదలిర్ప మెలంగు దేవ విం
తల్గద నీకతల్ సమద దానవ భంజన చెన్నకేశవా!

దంటతనమ్ము చేఁ గుసుమధన్వి ననంగునిఁ జేసినట్టి ము
క్కంటి త్వదీయమాయకు నొకా నొకవేళ వశత్వమంది వా
ల్గంటి తనంబుఁ జూపు నినుగానక విభ్రమమందె నింక యే
[illegible]ంటలు నిన్నెఱుంగుదురు తాపసవందిత చెన్నకేశవా!

విక్రమమేర్పడంగ నొక వేయిసమంబులు పోరి యమ్మహా
నక్రముచేతఁ జిక్కి శరణంబు రయంబున నన్నుఁ గావవే
విక్రమ ధుర్య దేవర త్రివిక్రమ నా గరిరాజుఁ గాచి వే
చక్రముచేత నక్రము వెసందునుమాడిన చెన్నకేశవా!

మున్నొక దేవశాత్రవుఁడు మోహకుఁడై శ్రుతులన్ హరింప న
త్యున్నత మత్స్యరూపమున నుత్సుకతన్ వనరాశిలోపలన్
గ్రన్ననఁజొచ్చి వాని యుదరంబును వ్రయ్యలు నేసి వేద రా
శిన్నలిన ప్రసూతికిడు శిష్టజనావన చెన్నకేశవా!

యాగభుజుల్ నరాదులు మహాంబుధిఁ ద్రచ్చఁగనెంచి యమ్మహా
నాగముఁ దెచ్చి రజ్జుగ నొనర్చి మహాధరణీధరంబు ను
ద్వేగ భుజాబలంబునొ దెచ్చి భరంబు మెయి సహింపలేనిచో
వేగమె కూర్మమై గిరిని వెన్నునఁ దాల్చిన చెన్నకేశవా!

ఈక్షితినెల్ల మున్నొకరుఁడీ హహారింపగ నెంచి ధీరతన్
రాక్షసుఁ డుద్యమింపఁగ ధరావలయమ్మును బ్రోచువాడవై
యాక్షణమందు భూరి కిటివై ప్రతిపక్షునిఁ గాంచనాక్షునిన్
శిక్షయొనర్చినట్టి సురశేఖర వందిత చెన్నకేశవా !

ఈ యఖిలేశ్వరుండు హరియేగతి నాసుతుఁ గిన్కమారదో
పాయము లెన్నిబన్నినను భంగమొనర్చుచు నమ్మదాంధుడై
తేయు నఖంబులం దునిమి ధీరత మీఱు తదీయపుత్రునిన్
బాయక బ్రోచు శ్రీనృహరి భక్తజనావన చెన్నకేశవా !

ఎమ్మెయి బ్రహ్మచారివయి యిమ్మసురేశ్వర నాకు మూడు పా
దమ్ముల నేల నంచడిగి తత్సకలమ్ము హరించి నాకలో
కమ్మున కాతనిన్ బ్రభునిగా నొనరించి సుఖమ్ము స్వర్గరా
జ్యమ్మునొసంగి యన్నను రయమ్మునఁ గాచిన చెన్నకేశవా !

ఘోర పరశ్వధాప్తి నృపకుంజరులం బలుమార్లు ద్రుంచి వి
స్తారతదీయ రక్తముల తర్పణముం బొనరించి ధీరతన్
ధారుణి నొక్కపారునకు దక్షిణగాగ నొసంగినట్టినీ
యారవరూపముం దలచి యంజలిఁ జేసెద చెన్నకేశవా !

భానుకులంబునం బొడమి పఙ్క్తిరథుం గరుణించి యాజన
స్థానము సేరి యందుఁగల తాపసవర్యులఁ గాంచి రావణున్
దానవకోటితోఁ దునిమి తామరసాక్షిధరాజతో నయో
ధ్యానగరంబుఁ జేరిన ఖరాంతక దేవర చెన్నకేశవా !

యాదవవంశ మెల్లఁ జెలువారఁగఁ జేయఁదలంచి యెంతయున్
సోదరవృత్తి నొక్కయెడఁ జూపుచు శ్రీబలరామకృష్ణతన్
మోదము మీఱఁ బాండుకులమున్ వెలయించిన దేవదేవ నీ
పాదపయోజరేణువు శుభంబుల మాకిడు చెన్నకేశవా !

సూనృతహీనులై మునుల సూరివరేణ్యుల విష్టపంబులన్
దానవులాక్రమించి బలదర్పము లేర్పడ సంచరింపఁగా
మానిజగద్ధితంబుగ నమానుషలీలగ బుద్ధరూపివై
దానవ గర్వముం గెడపు ధన్యచరిత్రక చెన్నకేశవా !

ధర్మపథంబువీడి వసుధాపతులెల్ల రసత్యులౌచు దు
ష్కర్మల నాచరించు నెడఁ గన్గొని విష్ణుయశుండు తండ్రిగా
నిర్మలరూపమంది యుపనీతల మెల్లను బ్రోచునట్టి స
త్కర్మచణా! నుతించెదను తావక కల్కిత చెన్నకేశవా !

ఈవ సమస్తలోకములు, నీవ జనిస్థితి నాశకారణం
బీవ సమస్తజంతువులు నీవ సురాసుర యక్షకిన్నరుల్
నీవ కుజంబులద్రులును నీవ సముద్రములీ వజాండమో
దేవ పరంబొకింత కలదే పరికింపఁగ చెన్నకేశవా!

చందురుడన్న నీవ జలజాత హితుండన నీవ యాశతా
నందుఁడవన్న నీవ పురనాశకుఁడన్నను నీవ దేవకీ
నందనుఁడన్న నీవ జననస్థితి నాశనహేతు వీవ నీ
యందఖిలమ్ము వెల్గు నఖిలాత్మవు నీవల చెన్న కేశవా!

ఆరయలేక సత్యమున హంతవచించి సదా మదోద్ధతిఁ
గోరి పదార్థముల్ మిగుల ఘోరపుకృత్యము లాచరించి సం
సారమె సారవంతమని సారెకుఁ గోరెడివారిఁ జేరఁ జే
కూరునె కోర్కెలెల్ల? నిను గోరినఁ గల్గెడి చెన్న కేశవా!

తానట గేహమంట తన దారధనాదికమంట యాత్మ సం
తానము మానమంట తన దంటతనమ్మన గెల్చునంట యీ
మానవకోటికిం గలుగు మందమతిం గనుగొన్నఁ జిత్రమౌ
తానులు గీను లేమగునొ తల్లెడివేళ్ళల చెన్న కేశవా!

ఏకమటంచుఁ గొందఱు ననేకమటంచును గొంచరింక న
స్తోకమటంచుఁ గొంద ఱతిసూక్ష్మమటంచును గొందఱూరకే
తేకువలేక వాదములఁ దేపకు సేయుచునుంద్రుగాని యా
త్మైక సువేద్య! నీ మహిమ నారయశక్యమె చెన్న కేశవా!

కన్నులెవండు విప్పిన జగమ్మఖిలమ్మను వెల్గుచుండెడిం
గన్నులెవండు మూసిన జగమ్మఖిలమ్ము లయమ్ముఁ జెందునో
యన్నళినప్రసూతిజనికాస్పదమైన త్వదీయ తత్త్వముం
బన్నగరాజ తల్పక! యెవండు నెఱుంగడు చెన్న కేశవా!

ఆఱిటఁ గోలుపోక విషయమ్ముల నైదిఁటివీడి మేలనన్
ధారణ సిద్ధి మాటిని సదావిడి యొక్కటఁటిఁగట్టి యయ్యహం
కారమమత్వముల్ విడి యొకండయి వెల్గెడిదైన నీపదం
బారయ వచ్చుఁగాక తరమా పెఱరీతిని చెన్న కేశవా!

నిత్యుఁడు ద్రష్ట యాత్మ యతినిర్మలుఁ డాద్యుఁ డనంతుఁడున్ బుధ
స్తుత్యుఁడు నద్వితీయుఁడు విశుద్ధుఁడు నామగుణాది శూన్యుఁడున్
సత్యుఁ డవాచ్యుఁ డవ్యయుఁడసద్విపరీతుఁడటంచుఁ దత్వగుల్
నిత్యము సన్నుతించెదరు నిన్నుఁ బరాత్పర చెన్న కేశవా!

జ్ఞానలవంబుచేఁ బ్రకృతిసంగతిలేక పరమాత్మయంచొగిన్
మానుగ సజ్జనాళి యభిమానమువీడి చిరాత్మకున్ నినున్
ధ్యానముఁజేసి సంతత ముదంబుధి మున్గుదు రిఁతెకాక య
జ్ఞాను లెఱుంగఁగాగలరె సారసలోచన చెన్న కేశవా!

నీదగు శంఖమిచ్చుత ననేకవిధంబుల నిత్యభాగ్యముల్
నీదగు చక్రమిచ్చుత ననింద్యజయేందిర సర్వకాలమున్
నీదగు చాపమిచ్చుత ననేకవిధంబుల నిత్య సౌఖ్యముల్
నీదగు నందకంబొసగు నిస్తులమోదము చెన్న కేశవా!

వందన మిందిరారమణ వందనమోహరి నందనందనా
వందనమధ్వరాశి విధివందిత సుందర పాద పంకజా
వందన మద్రిరాజధర వందనమో గిరిరాజధీర నా
వందనముల్ కృపంగొనుము వారిజలోచన చెన్న కేశవా!

శ్రీకరమైన శంఖమొక చేత సుదర్శన మొక్కచేత న
స్తోకగదన్ మరొక్కటను సుందరనందక మొక్కచేతిలో
శ్రీ కమలాసతిన్ హృదయ సీమ ధరించి వెలుంగుదేవ సు
శ్రీ కరుణాకటాక్ష యిదె చేతు నమస్కృతి చెన్నకేశవా !

మంగళమిందిరా హృదయ మంగళమో కరుణాపయోనిధీ
మంగళమో జగత్త్రితయ మాన్యచరిత్రక భక్తవత్సలా
మంగళమో సుధాశిగణ మస్తక రాజిత పాదపంకజా
మంగళవిగ్రహాసతత మంగళదాయక చెన్నకేశవా !

ఎవ్వఁడు నాత్మభక్తినిబఠించునొ యీశతకంబు వేడ్కమై
నెవ్వఁడు వ్రాయునో సుజనుఁ డెవ్వఁడు వీనులనాలకించునో
యవ్వనజాక్షుఁ డాతనికి నాయురనంత సుఖాభివృద్ధులన్
నివ్వటిలంగఁజేయు నవనీస్థలి సత్యము చెన్నకేశవా !

క్షీరాంబునిధివోలె చెలఁగు "రామడుగున"
బెదవెంకయాఖ్యుఁ డావిర్భవించె
భార్య "పిచ్చమ"దేవి పరిణయంబాది గాఁ
దనసపర్యలలోన మునింగియుండ
సరసు "సీతారామశాస్త్రిని" గనియెను
పుత్రుండు సాహితీ భూవరుండు
నిఖిలావధాన నిర్ణీత ధీకుఁడు కేవ
లమ్ము సరస్వతి యమ్మ చెల్ల!

కౌశికసగోత్రుఁ డాప్త వాక్పేశలుండు
నాశ్వలాయన సూత్రుఁడీయన రచించి
నట్టి యీ చెన్నకేశ దేవార్పితమ్ము
శతక మిద్ధర విజయించు సంతతమ్ము!



జానకీరామా ప్రెస్, తెనాలి.